12. తదనంతరం, బహాదరు అనంతపురం ఖండిణి బాకీ రూకలు వసూలు చేసేనిమిత్తం, జమాదార్ కన్నిరాం, హరకారా పుట్టయ్య, వీరిని యాభైగుర్రములతో యిక్కడ తయినాతి వుంచి, మురారిరాయణ్ని పట్టుకొని అనంతపురంమార్గాన సాగించి, తాను దండు సహితముగా కూడేటి మార్గాన చిత్రకంటితట్టు పోయి, యీ గుత్తి సుబా బాలాజీరాయని వారికి యిచ్చి, అనంతపురం సంస్థానంతట్టునుంచి ప్రతిసంవత్సరం నలభైవేల రూపాయీలు వసూలు చేయమని చెప్పి వుండిరిగనక, అదేప్రకారం వెనకముందు చెల్లిస్తూవచ్చినందున, సంస్థానం బీదగిలివచ్చెను. యిట్లావుండగా ఆ బాలాజీరాయుడు కాలంచేసినందున, గుత్తిసీమ అధికారం సుబాదారు నరసప్పయ్యగారికి శాలివాహనశకం ౧౭౦౩ అగునేటి ప్లవనామసంవత్సర శ్రావణ శు ౩ లు (23rd July A. D. 1781) రోజున యిచ్చి అంపించెను.

13. అతను ఆ తాలూకా యావత్తు ఠాణావేసుకొని, విచారిస్తూవుండి, యీ అనంతపురం రూకల నిమిత్తం బంట్రౌతులను అంపించి, తొందరపెట్టి నిర్దాక్షిణ్యంచేత కోటవాకిళ్లు దివాణం వాకిళ్లుకట్టించి శానాకష్టపరచెను, యిచ్చేదానికి ద్రవ్యము లేకపోయనందున, ఆ సుబేదారు నరసప్పయ్యగారు రాజ్యంమీద రూకలు చెదరిపోకుండా, యీ సిద్ధరామప్ప నాయునివారిని కూర్చుండపెట్టుకొని, "యావత్తు నీవు విచారించి అందుల వర్తమానం వ్రాయించి అంపించ"మని తమతాలూకు ముత్సద్దిబెట్టదరాయనికి సెలవుయిచ్చి అంపించిరి. అతనువచ్చి యిక్కడి



వర్తమానం యావత్తు విచారించి, రాజ్యం మీద రూకలున్న బొక్కసంలో అయివజున్న లేదు అని వ్రాయించిపంపించెను, ఆ వుత్తరములను చూస్తూనే ఆ నరసప్పయ్యగారు కొంతబలంతోవచ్చి దేశాయి తోపుదగ్గరదిగి, కోటలోనుంచి శిద్ధరామప్పనాయునివారిని పిలిపించి, భేటీతీసుకొని పేటలో సబునవీసు తిమ్మప్పగారి యింట్లోదిగెను. దొరవారు అప్పణతీసుకొని దివాణంలోకి పోయిరి.

14. ఆ మర్నాడు సుబేదారు నరసప్పయ్యగారు కోటలోకి పోయి, మాబాకీ రూకలు పరిష్కారముగా యిస్తే మేము పోతున్నాము, రూకలకు యేమిమార్గమని సిద్ధరామప్పనాయుని వారిని అడగగా; "మాకు రూకలు యిచ్చేదానికిలేదు; మీ రాజ్యం మీరే విచారించుకోవలసిన"దని కోట బీగముద్రలు వొప్పచెప్పినందున, ఆ నరసప్పయ్యగారు "నీకు కలిగిన అయివజు యిచ్చినట్టు ఆయితే మేము గుత్తికిపోతున్నాము; ముందర కాలదేశవర్తమానం యేరీతున నడుస్తూవున్నదో, తదనుసారం నడవవలసినదానికి యిప్పుడే స్థలం వొప్పచెప్పేది బాగులేదు" అని చెప్పగా వినక, "సర్వదా నాచేత నిర్వాహకం లేదు" అని వొప్పచెప్పినందున కోట ఠాణా బందోబస్తు చేసి సేఖుమీరా అనేవాణ్ని ఖిల్లాదారుగా నేమకంచేసి, బెట్టదరాయలవారికి అములుయిచ్చి, యీ శిద్ధరామప్పనాయునివారికి గ్రాసానకు సుంకంమీద దినం ౧కి నాయడిహొన్ను ౧ ప్రకారంయిచ్చేలాగున నియమించి, చెరువుకింద వీరుచేస్తూవున్న కమతం మళ్లుయావత్తు నడిచేటట్టుగా బెట్టదరాయనివారికి చెప్పెను.

15. ఈ శిద్ధరామప్పనాయుని వారికొమారుడైన పెద్దరామప్పనాయుని వారినిన్ని, కొంత మందిని దండులో కొలువు

చేనేనిమిత్తం నేమకంచేసి, మూడవకొమారుడైన సిద్దప్పనాయుణ్ని శ్రీరంగపట్నం పంపించి, యీ దొరవారు దివాణం విడిచి వెలపటికి పోకుండా వుండేలాగున కావలి జనాలను వుంచి, తాను గుత్తికి పోయెను. యింతకులోగడనే, బహాదరు నవాబు దండుకు పోయివున్న చిన్న రామప్పనాయుడున్ను, పెదరామప్పనాయుడున్ను, యుద్ధరంగములో కాలంచేసిరి. మరికొన్ని దినములకు నరసప్పయ్యగారి సుబాపోయి, టీపుసుల్తాన్ వారు యీగుత్తి సుబాకు శిస్తియర్ ఖాన్ సాహేబులనున్ను, యీ హండె అనంతపురానకు మహమ్మదు అషరపు సాహేబులనున్ను, కిల్లాకు హుశేన్ ఖాన్ ఖోజాగారినిన్ని నేమకం చేసిరి. వారువచ్చి లోగడ నరసప్పయ్యగారు నెల ౧కి నియమించిన సుంకముమీది గకెంన్ని, ఖాసా కమతమున్ను జప్తిచేసి, అములు జరిగిస్తూ వుండిరి.

16. మరికొన్ని దినములకు ఆ అములుదారులు బరతరపు అయి బదులు శ్రీరంగపట్టంనుంచి కిల్లాకు న్యామత్ఖానుడు, అములుకు ఫత్తెసాహేబు, వీరుయిద్దరువచ్చి అధికారం జరిగిస్తూ వుండగా; యీ శిద్ద రామప్పనాయునివారికి ఖర్చు వెచ్చాలకు యిక్కట్టు అయి, దగ్గెరవున్న వస్త్రపాత్రాగులు మొదలయిన చిల్లర సామానులను విక్రయంచేసుక కాలక్షేపం చేస్తూవుండిరి; దేహం రోగాస్పదమైనందుననున్న, కొమాళ్లు అయిన పెదరామప్ప చినరామప్పగార్లు దండులో హతులై నారనే వర్తమానం విన్నందుననున్ను, సామీప్యమందువున్న చిన్నకుమారుడయిన శిద్దప్పనాయుడు శ్రీరంగపట్నం పోయినందువల్లనున్ను, పట్టపు భార్యక శ్యాణమ్మగారు కాలంచేసినందుననున్ను, అత్యంత దుఃఖమునుపొంది కృశించి, శాలివాహన శకవరుషంబులు ౧౭౧౦



అగునేటి కీలకనామసంవత్సర కార్తీక శు ౧౫ నాడు [13 th Nover. A. D. 1788] కాలంచేసెను.

---

# CHAPTER EIGHT.

1. తదనంతరం యీన్యామత్ ఖాన్ ఫత్తెసాహేబుల వారి అములులో, యీ సిద్దరామప్పనాయుని కొమాళ్లు, హనుమప్పనాయుడు ౧, బసవప్పనాయుడు ౧, పెద్దకొమారుడైన పెదరామప్పనాయుని కొమాళ్లు సిద్దరామప్ప ౧, వసంతరాయడు ౧న్ను అమ్మగారు మొదలయినవారు వుండగా, వారిని అందరిని చాకీపహారా పెట్టివుంచెను, మరికొన్ని దినములు జరిగినపిమ్మట, కిల్లాన్యామత్ ఖానుడికి విడదల అయి, బదులు కిల్లాదారుమీరు ఖాశీం అనేవాడువచ్చి చాకీపహరాయీవత్తు బందోబస్తు చేసుకొని యుండగా, టీపుసుల్తాన్ వారిదగ్గెరనుంచి కిల్లాదారుణ్ని అమీలుదారుణ్ని సహా, బకరీదు పండుగకు నజరు తీసుకరమ్మని పరవానావచ్చినందున, యిక్కడ బదులు రెండవ కిల్లాదారు సైదుహుశేనుసాహేబును వుంచి, శిరస్తేదార్లుసహా తాము శ్రీరంగపట్నానకు పోయిరి. అక్కడ టీపువారి దర్శనంచేయగా, వారు యీ కిల్లాదారు మీరు ఖాశీంతో అనంతపురములో తాణావున్న బెంగుళ్లూరి తిమ్మానాయుని తాలూకు యిన్నూరుమంది బంట్రౌతులను, హజూరుకు పంపించమని లోగడ వ్రాయించిన పరవానా ప్రకారం, జరపక పోయినదేమి ? అనిఅడుగగా, "అనంతపురంలో చాకీపహరాలకు, బంధీఖానా

జనులకు, సంస్థానం జనులకు, బందోబస్తు చేసేనిమిత్తం అక్కడనే వుంచితిమి అని ఆ మీరుఖాశీం మనవి చేసెను.

2. అది విని టీపువారు యింకాసంస్థానికులజనం వున్నారా? అని అడిగిరి; "సిద్ధరామప్పనాయునివారికొమాళ్లు యిద్దరు, మనములు యిద్దరు, కొందరు అమ్మగార్లు, అల్లుడు, కొమాళ్లు, యీ మొదలయినవారు వున్నా" రని యీ కిల్లాదారు మీరుఖాశీం చెప్పినందున; యీవత్తువిని, ఆ టీపుసుల్తాన్‌వారు నీవు అనంతపురానకు పోతూనే, పెద్దవాండ్లైన కొమాళ్లను, అల్లుడు కొమాళ్లను, గాలాన వేసి మిగిలిన జనులను హజూరు శ్రీరంగపట్నానకు అంపించమని హుకుం చేసెను, యీ మీరుఖాశీం సెలవు తీసుకొని అనంతపురానకువచ్చి, ఆ హుకుం ప్రకారం సిద్ధ రామప్పనాయునివారి కొమాళ్లు హనుమప్ప; బసవప్ప; అల్లుడైనదాల్ ప్రభయ్య, యీ ముగ్గురిని గ్రామానకు వుత్తరభాగాన అరుకోసులమీద బుక్కరాయ సముద్రానకు పొయ్యే మార్గానకు పడమర కాశీ విశ్వేశ్వరుని తోపులో, మొదటి చెట్టున గాలానికి వేయించెను. యింకా వారి సంబంధమైన జనాలు శాంతప్ప, దళవాయి హాల్ శరభప్ప, చిన్న సుబ్బరాయప్ప, యీ ముగ్గురిని నీలమ్మ తోపులో వొక మామిడి చెట్టున గాలానికి వేయించెను. వారి మనమలను యిద్దరిని, యింకా వారి సంబంధీకులయిన జనులను, అమ్మగారిని సహా, పహరా వెంటయిచ్చి శ్రీరంగపట్నానకు పంపించినందున, యిక్కడి దివాణం పాడు అయినది.

3. అంతట టీపు సుల్తాన్ వారు శ్రీరంగపట్నంలో వున్న సిద్ధప్పనాయునివారికి, నెల ౧కి కంటేరాయిపరహాలు అరువై చొప్పున సంబళం నేమకం చేసి యిస్తూ, రెండు వేల కామాటీ



జనం చేత పని జరిగించుమని ఆజ్ఞయిచ్చి, అధికారం నేమకం చేసి దానికి తగిన జనులను యిచ్చి, మైసూరిలో చేరిన నజరతాబాదు కట్టించుచుతూవుండిరి. యీ అనంతపురములోనడిచిన యీ వద్వర్తమానం ఆ సిద్ధప్పనాయునివారు విని, తనకున్నూ యేమి వుపద్రవం వచ్చునో అని భయంచేత చింతించుచుతూ వుండగా; యీ నజరతాబాదు కట్టే నిమిత్తమై అనంతపురంనుంచి వచ్చి వుండే వాండ్లలో, తనకు అప్తుడైన తిమ్మనబోయి తన కొమారునికి పెండ్లి చేయుతలంచి, దారోగా వద్దికిపోయి, అతనితో "యిక్కడ మాకు చుట్టాలు యెవరులేరు, గుత్తిశీమలో వున్న మావారు పడుచును యిస్తున్నాము రమ్మని వ్రాసి పంపినారు. గనక అప్పణ అయితే పోయి పెండ్లికార్యం నడిపించుకొని వస్తున్నా" మని చెప్పుకోగా; ఆ దారోగా హజూరుకు పోయి యీ సంగతి యీవత్తు మనివిచేసి, ఆ తిమ్మనబోయికి ఖర్చులకు యిచ్చి, వాని సాలు సామానులతో కూడా పోవడానకు రహదారి యిచ్చి పంపించెను; తాను యీ రాజ్యానకు వచ్చినప్పుడు, ఆ సిద్ధప్పనాయుడు "నీవు రాజ్యానికి పొయ్యేటప్పుడు నన్ను కూడా తీసుకొనిపోయి మా రాజ్యములో విడిచినట్లు అయితే, నీకు తగిన బహుమానం యిస్తున్నాను" అనిచెప్పుకోగా, సమ్మతించి మాటయిచ్చి వుండెను గనక, అదే ప్రకారం ఆతిమ్మనబోయి ఆ సిద్ధప్పనాయుణ్ని వెంట తీసుకొని చౌకీ పహరాలకు రహదారి చూపించి, సాలు సామాను బండ్లుసాగించుకొని, ఆమడ దూరము పోయి సూర్యోదయమైన పిమ్మట తమ మనిషిని వొకణ్ని వెంటయిచ్చి "రెండు భారీ ప్రయాణాలు మీశక్తికంటేమించి పోవలసినదని" చెప్పిపంపించగా, ఆ సిద్ధప్పనాయునివారు ప్రాణాపేక్షచేత రాత్రి పగలు వొక

చోటను అయినా నిలువక, దినం ౧కి అయిదు ఆమడ చొప్పున నాలుగు దినములు నడిచి, తమ రాజ్యానకు వచ్చి చేరెను ఆ తిమ్మనబోయి మజిలీ ప్రకారం అక్కడక్కడ నిలుస్తూ వచ్చెను.

4. తర్వాత యీసిద్దప్పనాయునివారు కాళహస్తిసీమలో పాపానాయునిపేట చేరి, అక్కడ నాలుగు దినములు ఆసోదా చేసుకొని, వక గుర్రాన్ని క్రయానకు తీసుకొని, పదిమందిని కొలువు నిలుపుకొని దొరతనానకు తగిన యోగ్యత చేసుకొని, అక్కడి నుంచి కాళహస్తికి పోయి వూరివెలపట దిగి, ఆచట వున్న దామర్ల తిమ్మానాయునివారికి, "అనంతపురం హండె సిద్దరామప్పనాయునివారి కొమారుడైన సిద్ధప్పనాయునివారు, తమ దర్శన నిమిత్తం వచ్చి వున్నారు" అని కావలి వారితో సమాచారం చెప్పి పంపించిరి ; వారుపోయి యీ సంగతి తమ దొరవారితో మనవి చేయగా అదివిని ఆ తిమ్మానాయునివారు పెద్దసంస్థానం యింటితనంవారు వచ్చినారు అని ప్రయాణం అయి యెదురుగా వచ్చి బహుమానం చేసి తోడక పోయి విడిదిలో దించి, తాను సెలవు తీసుకొని నగరికి పోయి, కోటలోనుంచి కానుక పంపించి, మిక్కిలి పరామరిక చేస్తూ పది దినములు అక్కడ నిలుపుకొని, వస్త్ర పాత్ర తాంబూల పురస్సరముగా కుంకలగుంట అనే గ్రామమును వుమ్మళిగ యిచ్చి ; అసల పాపానాయుని పేటకు అంపించిరి.

5. ఆ తిమ్మానాయునివారు అక్కడ వున్న గురికానికి యీ దొరవారు మన వారైనందున వీరిమీద బహు పరామరిక వుంచి, వీరు కట్టించుకొనే గృహానికి యేమి సామాను అడుగుతున్నారో అది యిప్పించి, బహు జాగ్రతగా వుండవలసినదని తన పేర తాఖీదు పంపిరి ; అదే ప్రకారం ఆ గురికాడు నడుచుకొన్నందున ; యీ సిద్దప్పనాయునివారు అక్కడ యిల్లు వేయించుకొని, ఆ వుమ్మళిగ యిచ్చిన గ్రామమును ఆబాదు చేసుకొని, స్వంత కమతమును పెట్టించి అయిదు ఆరు సంవత్సరములు అక్కడనే వుండెను. లోగడ శ్రీరంగ పట్నములో వుండేసుల్తాన్ యీ అనంతపురాన్నుంచి పట్టుకపోయి కయిదులో వుంచిన శిద్ద రామప్పనాయునివారి చిన్నాచిరతల గణితి తీసుకొని, తగిన ప్రకారం ఖర్చులకు ఆరుసంవత్సరముల వరకు పోయి వుండిరి. తర్వాత శా-శకం ౧౭౧౨ అగునేటి సాధారణ సంవత్సర మాఘ మాస మందు [Febry. 1791, A. D.] ఫేష్వావారి తాలూకు హరపంతపటకె అనేవారి పౌజున్ను, నిజాంవారి తాలూకు పౌజున్ను, అనంతపురం మార్గముగా శ్రీరంగపట్నము పోయి ముత్తిగె వెయ్యవలెనని అల్లరి చేస్తూ వుండగా ; చిల్లర పాళేగాండ్లు యావజ్జనం తమ తమ సంస్థానాలు బలకాయించుకొనే దానికి యిది సమయమని పోగా, చిక్కిన సంస్థానికుల తాలూకు జనం మందిని గూర్చుకొని హంగామా చేస్తూ వుండిరి.



6. ఇట్లా వుండగా రామదుర్గం లాడగొండ బలిజ రుద్రప్ప అనేవాడు యిదే సమయమని తలంచి, పాలేరు వచ్చిచేరి ఆ గ్రామస్థులతో "నేను అనంతపురం సిద్దరామప్పనాయుని కుమారుణ్ని ; ఆయన వుంచుకొన్న దానికి పుట్టినవాడను ; మా చిన్నా చిరతలను పట్టుక పొయ్యే వేళ నేను తప్పించుకొని అక్కడక్కడ తిరిగి వచ్చి చేరితిని" అని చెప్పుకొన్నందునున్ను ; పరంపరగా ఆ దొరలవద్ద వున్న మొగదల బసవప్ప

కుమారుడయిన చెన్నప్ప ఆ రుద్రప్ప వద్ద చేరి, ఆ గ్రామస్థులకున్ను యింకా అడిగినవారికిన్ని యిది నిజమైన సంగతేను అని చెప్పినందుననున్ను; వారు అట్లా వుండినా వుండును అని యోంచి ఆయనకు ఆయుష్కర్మమున్ను స్నానమున్ను చేయించి, వస్త్రపాత్రాదులు తెప్పించి యిచ్చి చుట్టుపట్టున వున్న పల్లెల గ్రామస్తులను మందిని పిలిపించి, వారితో "యీయన మనపూర్వం దొర కొమారుడైనందున, యీ గ్రామాలు యితని స్వాధీనము చేసినట్టు అయితే, యీ కష్టకాలం కడతేరుదుము" అని కొరకొళ్ల, కూడేరు, వాటికి చెల్లే వుప గ్రామాలు సహా తాణా వేసి యిచ్చి, ఆ రుద్రప్పను దొరనుగా నియమించి కూడేటిలో వుంచిరి. తదనంతరం, నాయక బావా అనే సరదారుడు వచ్చి రాయదుర్గం తాణా వేసెను; పూర్వం హావళిగ అనే గ్రామం కట్టించిన నరసింగరాయని కొమారుడైన అశ్వద్ధరాయనివారు అతని వెంబడి వచ్చి యీగ్రామం మా పెద్దలు కట్టించినది అని మనవి చేయగా, ఆ గ్రామం తాణా యిచ్చి ఆ అశ్వద్ధరాయనివారి స్వాధీనము చేసెను.

7. తదనంతరం యీ కూడేటిలో వున్న రుద్రప్పతో, అక్కడ వున్న దుష్టచతుష్టయం "మనము వూరికె వుంటె యెట్లా అనంతపురం రాజ్యం పూర్వభాగమందు గ్రామాలు శానా వున్నవి అని యావత్తు తాణా వేయవలె"నని చెప్పిరి; ఆ రుద్రప్ప అదివిని, "మనవద్ద అర్థ సాహాయ్యమున్ను జనసాహాయ్యమున్ను లేదు; వూరికె పారియాడితె యేలాగున అయ్యీని" అని చెప్పగా; ఆ దుష్టజనులు యీ రుద్రప్పను వెంట



బెట్టుకొని, హావళిగె అనే గ్రామానకు పోయి, అశ్వద్ధరాయని భేటి చేయించి, వారితో పూర్వం హిరేహాళు శివప్పగారు మా సంస్థానం నిల్పినారు; ఆయనను యిప్పుడున్ను దీపం పెట్టి స్మరిస్తూ వున్నాము; అలాటి సమయం వచ్చియున్నందున, మా దొర అయిన రుద్రప్పగారికి మీ తట్టునుంచి గుర్రం పౌజు సాహాయ్యం చేసి యిస్తే, మా దగ్గిర వున్న మందినిన్ని కూడా తీసుక పోయి, అనంతపురం రాజ్యం తాణా వేసి బందోబస్తు చేసుకొని, మీకు మాటవాసి తెస్తున్నాము" అని చెప్పి, తాము తీసుక పోయిన వస్త్రపాత్రాదులు ఆ అశ్వద్ధరాయని వారికి నజరుపెట్టి, "యీ కార్యనిర్వాహకమయితే కూడేరు, కొరుకొళ్ల తమకు వేసి యిస్తున్నాము" అని ఆశ చెప్పిరి.

8. అది విని ఆ రాయనివారు నూరు గుర్రాన్ని కొంత మందు గుండు యిచ్చి, యీ రుద్రప్పకు వస్త్రపాత్రాదులు యిచ్చి అంపించిరి. అక్కడనుంచి తమ పౌజున్ను ఆ గుర్రమున్ను సహా తీసుకవచ్చి, రుద్రప్ప బుక్కపట్నం, కొత్తచెరువు, పంటికొండ, మల్లెకొండ, మరూరు, ముక్తాపురం మొదలయిన స్థలాలు యావత్తు తాణా వేసి, అనంతపురం పేటకు దిగి ముట్టడి వేసెను. యీ వర్తమానం శ్రీరంగపట్నములో వున్న టీపుసుల్తాన్ వారు విని, పాళెగాండ్లు హంగామి చేత తమతమ గ్రామాలు జలకాయించుకోవలెననే యోచన చేసినారని తలంచి, తన బయిదరు గుర్రాలకు సరదార్లు అయిన గాజీఖాన్, మద్దూఖాన్, మీర్ మీరా, వీరిని అయిదు నూర్లగుర్రంసహా కచ్చేరి బాబురాయని వెంబడి యిచ్చి, భారీగళ్ళకు రస్తు వేసే నిమిత్తం రూకలు యిచ్చి సెలవు యిచ్చి అంపించిరి; వారు గడి

గడికి వచ్చి, ఆయా జాగాలకు తగిన రస్తువేస్తూ, గుత్తికిపోవలెనని యీ అనంతపురం మార్గంగా వచ్చి, కోటలోవున్న వారికి చెప్పి అంపి, రాప్తాడునుంచి అనంతపురానకు పగలు రెండు ఝాములకు వచ్చి, అమ్మగారి చెరువు బయలున నిల్చి వుండిరి.

9. అప్పుడు ఆ కోటలో వున్న ఫౌజు వూరు వాకిలి తీసుకొని, యీ పేటలో వున్న రుద్రప్పగారి ఫౌజు మీద పడి లడాయిచేస్తూ వుండగా, యీ బయిదర్ గుర్రం ఫౌజు లేచి రాప్తాటి వాకిలికి, వుప్పరపల్లె వాకిలికి, అడ్డంగా వచ్చినిలిచెను, పేటలో ముట్టడి వేసి వున్న రుద్రప్పనాయుని ఫౌజు, యిది చూచి అధైర్యపడి మోర్జాలు విడిచిపెట్టి పొయ్యేదానికి మార్గం లేక, బహుమంది హతులైరి. తక్కినవారు చెరువులో కొంచెము నీళ్లు వుండగా, ఆ నీళ్లలో పడిపోతూవుండగా చూచి, యీ కోటలో నుంచి వచ్చినమందిన్ని, అడ్డకట్టుకొన్న బయిదర్ ఫౌజున్న వారిని పట్టుకవచ్చి, ఖిల్లేదారు న్యామత్ ఖాన్, ఆమిల్ ఫత్తేమహమ్మదు, యీ వుభయులు బాజారు వెంబడి రణం విచారిస్తూ, యీ చెరువుకట్టకు పడమటి దిక్కున పోతురాజు బయలున వుప్పర్లపల్లెకు పొయ్యేమార్గం దగ్గర నిలిచివుండగా, వారి యెదుట వుంచిరి. వారు యీ చిక్కినవారికి యేమి శిక్ష చేయవలెనని యీ గాజీఖాన్, మద్దూఖానులవారిని అడుగగా, వారు కాళ్లు చేతులు ఖండించినట్టు అయితే బహు ప్రసిద్ధిగా వుండునని చెప్పినందున, న్యామత్ఖాన్, ఫత్తేసాహేబులవారు అదే ప్రకారం యీచిక్కిన జనులను కాళ్ళుచేతులు తెగగొట్టించిరి. ఆ రుద్రప్ప కొంత జనంతో పారిపోయెను.

---

# CHAPTER NINE.

1. తర్వాత శ్రీరంగపట్నంవారు రాజీ చేసుకోగా, ఫేష్వావారి ఫౌజున్ను నిజాంవారి ఫౌజున్ను తమతమ జాగాలచేరెను; తర్వాత యీ అనంతపురములో వున్న న్యామత్ ఖాన్, ఫత్తేసాహేబులవారు ఆదేశం యావత్తు ఠాణావేసి, రయితు రాజీచేసి విస్తారం సాగుబడి అయ్యేటట్టుచేసిరి. టీపుసుల్తాన్ వారు శాలివాహన శకం ౧౭౨౦ అగునేటి కాళయుక్తినామ సంవత్సర మాఘమాసము ఆఖరు (A. D. 8th March 1799) వరకు రాజ్యము విచారిస్తూవుండిరి. యింగ్లీషు వారి ఫౌజు వచ్చి శ్రీరంగపట్నం ముట్టడివేసి వుండగా, హాయిదరాబాదు తట్టునుంచి నిజామల్లిఖాన్ వారు యీ యింగ్లీషువారికి సహాయముగా, అమీర్ సాహేబు, రాజా రోషంరావు, మీర్ ఆలం, మొదలయినవారి వెంబడి కొంత ఫౌజుసాహాయ్యం చేసి అంపించగా వారున్ను వచ్చి కోట ముట్టడి వేసి రెండు నెలలు జరిగినమీదట యుద్ధరంగమందు టీపుసుల్తాన్ లడాయి చేసి హతుడైనందున, శకం ౧౭౨౧ అగునేటి సిద్ధార్థినామ సం. చైత్ర బ 30 దిని ౨ ఝాములకు (A. D. 4th May, 1799) శ్రీరంగపట్నంలో కుంఫిణి వారి ఠాణా పడెను.

2. ఈ వర్తమానం చతుర్దిక్కుల ప్రసిద్ధి అయినందున కాళహస్తితాలూకు పాపానాయుని పేటలో వున్న హండే సిద్దప్ప నాయుడు విని, తమ స్వజనంతో వేముల పులి వెందల

ఆ ప్రాంత్యాలకు వచ్చి, యెర్రగొర్ల శీతన్న, పెదవెంకటపతి మొదలయినవారితో మాట్లాడి, కొంతమందిని తీసుకొని అక్కడినుంచి బుక్కపట్నం, కొత్త చెరువు తట్టు వచ్చేవేళకు, ఆ గ్రామస్థులు యీ వర్తమానం విని, తమ దొర వచ్చెనని యెదురుగా పోయి వెంటపెట్టుక వచ్చి, కొత్త చెరువులో వున్న నిడుమామిడి స్వాములవారి మఠములో దించిరి. యెనిమిదిదినములు అక్కడవుండి, ఆ చుట్టు పట్టు గ్రామాల మందిని కొంత కూర్చుకొని స్తోమంతో వచ్చి రాప్తాడు చేరెను. యీ అనంతపురం కోటలోవున్న ఖిల్లాదారుడు, రిసాల్ దారుడు, బేలుతంబురాలు, గోలందాజులు, సగైరాబారువాండ్లు సహావుండి శ్రీరంగపట్నానకు ముట్టడి దిగిన తాగాయతి తమకు మూడు నెలలు సంబళం బాకీ వున్నది యిమ్మని, అవల్ ఖిల్లేదారు దుయ్యం ఖిల్లేదారు, యీ కందాచారం వుభయ శిరస్తేదారులయిన హనుమంతరాయడు, రామరాయడు అనేవారిని పహారాలోవుంచి నిర్దాక్షిణ్యముచేసి, నన్నూరు వరహాలమట్టుకు వసూలుచేసిరి. ఆ వరహాలను సరబేలు బిరాంషిరీఫు యావత్తు మందికి పంచిపెట్టైను. పిమ్మట రాప్తాడు వచ్చి చేరిన యీ సిద్దప్పనాయునివారు, అనంతవురం చుట్టుపట్టు స్వారిచేస్తూ వుండఁగా, కోటమీది నుంచి తోపుఖానాలు కాల్చినందున వెనక్కు పారిపోయెను.

3. ఈసమయంలో శ్రీరంగపట్నములోనుంచి చెరసాలవిడుదల అయి, యీ సిద్దప్పనాయుని అన్నకొమారుడు అయిన వసంతరాయడు, అమ్మగారు మొదలయిన జనముతో కూడా వచ్చి రాప్తాడు చేరిరి; ఆవసంతరాయని వారిని యీసిద్దరామప్పనాయునివారు ఆలింగనము చేసుకొని, బహుశా పశ్చాత్తాపపడి ఆదరిస్తూ వుండిరి; అనంతపురములోవున్న రిసాల్ దార్ల వగయిరా వారు పట్నంపోయి టీపుసుల్తాన్ వారు వచ్చిన సమాచారం తెప్పించుకొని, "మాకు రెండు నెలలసంబళంబాకీ వున్నది; అదిన్ని ముందు మా నలుగురికి అన్నస్థితిన్ని చేసి యిచ్చినట్టు అయితే, గ్రామం తాణా యిస్తున్నాము" అని పెద్దమనుష్యుల ముఖాంతరంగా యీరాప్తాటిలో వున్న సిద్దప్పనాయుని వారికి చెప్పి అంపించిరి. అది విని వారి అభిప్రాయమును అంగీకరించి, బండమీది పల్లె సుబేదారు లాడఖాన్, ఖాలీసాహేబున్ను నాగలింగప్పకొమారుడు అయిన కోటప్పనున్ను అనంతపురములోకి అంపించగా, వారుపోయి పేటలో బసవన్న దేవాలయం వద్ద కూర్చొని, కోటలోవున్న రిసాల్ దార్ల పెద్దమనుష్యులను పిలిపించి, వారితో "మీరుకోటతాణాయిచ్చినట్టుగానే మీరెండు నెలల సంబళం యిస్తున్నాము; మీ మందిని యావత్తు సూదగ్గెర కొలువు నిలుపుతున్నాము; మీ నలుగిరికి అన్నస్థితులను చేసి యిస్తున్నాము" అని బహువిధాలా కుదరచెప్పిరి.



4. అదివిని ఆపెద్ద మనుష్యులు సమ్మతించి, వారు వీరు కలసి మాట్లాడుకొని, అదే మేరకు వారి తాంబూలం వీరు వీరి తాంబూలం వారు తీసుకొని, "మీరు దొరవారిని కళ్యాణమ్మగారి బావిదగ్గెరకి పిలిపించి, ఖిల్లాలోకి మాకు ఖబురు చెప్పి అంపితే, మేము తయారు అయి యీ బసవణ్ణ కట్టదగ్గెరికి వచ్చి, మీరు మేము యెదుర్కొని పోయి వారిభేటి చేసుకొని తోడకవచ్చి, కోట తాణా యిస్తున్నాము" అని చెప్పి

వారు కోటకు పోయిన పిమ్మట, యీ కోటప్ప లాడఖాన్ ఖాలీసాహేబులవారు యీ వర్తమానం దొరవారికి చెప్పి పంపగా, వారు విని బహుసంతోషపడి, మర్నాడు రాత్రాటి నుంచి తన జనంతోకూడా కళ్యాణమ్మగారి బావి దగ్గరికి వచ్చిరి. యీ వర్తమానం కోటలోకి చెప్పి అంపగా, అక్కడ నుంచి ఆరిసాల్దార్లు కొంత బారుమంది పెద్దమనుష్యులు సహా బసవన్న కట్టదగ్గరికి వచ్చి, కోటప్పరాడఖాన్ ఖాలీ సాహేబులవారినిన్ని వెంటబెట్టుకొని, యెదుర్కొని పోయి ఆ సిద్దప్పనాయనివారికి బహుమాన సన్మానములు చేసి, వుభయ సేనలతో తోడకవచ్చి అనంతపురం ఖిల్లా బీగముద్రలు వగైరా వారివశం చేసి కోటతాణా యిచ్చిరి. పిమ్మట యీ సిద్దప్పనాయుడు ఆకోట రెండో అలంగం అగడ్త మీద వున్న బతేరీలమీద సహా తనచౌకీ పహరా వుంచి, కోటలో వున్న రిసాల్దార్ల నలుగురికివస్త్ర తాంబూలాలు యిచ్చి సెలవు యివ్వగా, వారు తమ తమ జాగాలకు పోయిరి.

5. తదనంతరం, యీ సిద్దప్పనాయుడు అదివరకు వివాహం లేదు గనక, శకం ౧౭౨౧ అగు నేటి సిద్ధార్థినామ సంవత్సరం జ్యేష్ఠ బ ౫ లు (A. D. 22nd June 1799) వివాహముహూర్తం నిశ్చయించి, సకల సాహాయ్యం చేసుకొని, తమ సంబంధులయిన జగ్గుల కూసప్ప కొమార్తె నీలమ్మగారిని వివాహమాయెను. పిమ్మట శ్రీరంగపట్నానకు కుమ్మకుగా పోయిన, నిజామల్లీఖాన్ తాలూకు ఆమీను సాహేబులవారున్ను, రాజా రోషంరాయలవారున్ను, సైన్య సమేతముగా గుర్రంకొండ మార్గాన గుత్తికి వచ్చి, తాణా వేసి బందోబస్తు



చేసే నిమిత్తం అనంతపురం మార్గాన వచ్చి, యీ సిద్దప్పనాయునివారిని భేటికి పిలిపించి, వారితో "మీ జాగా తాణా వేసి యిచ్చి, మేము యిచ్చిన అన్నం భోజనం చేసుకొని ఖైరు వుండేలాగున, మా ధణీ హుకుం అయిన"దని చెప్పి, అనంతపురం తాణా వేసుకొని, వారి చిన్నా చిరతలను బుక్కపట్నం దగ్గరవున్న సిద్దరామపురమందు వుంచి, ఆగ్రామం ఆయనకు వుమ్మళిగె యిచ్చి, నూటికి వరహాలు పది ప్రకారం యేర్పాటు చేసియిచ్చి, వెంకటాద్రిపంతులవారికి యీ అనంతపురం తాలూకా అములు యిచ్చి, ఆదవాని తాలూకా బ్రాహ్మడు బెనకప్ప అనే వానికి ఖిల్లా వొప్పగించి, పౌజు లేచిపోయెను.

6. తదనంతరం, మీర్ ఆలం తాలూకానుంచి నాగనాథరాయనివారికి, యీ అనంతపురం తాలూకాకున్ను, మరికొన్ని తాలూకాలకున్ను, అములు యిచ్చి అంపించగా, వారు యీ రాజ్యం విచారించుతూ, ఆమీన్ సాహేబులవారు యీ సిద్దప్పనాయునివారికి నియమించిన ప్రకారమే, ఆ సిద్దరామపురమున్ను ౧౦౦కి ౧౦ వంతున్ను పది నెలల పర్యంతం జరిపిస్తూ వుండిరి. తదనంతరం కంపినీ తాలూకు కర్నల్ మండ్రోల్ సాహేబులవారు, కంపలి ఆ ప్రాంత్యాన్నుంచి అనంతపురం శీమ బందోబస్తుచేసే నిమిత్తం నరశింగరాయనివారిని పంపించగా, వారు శా-శకం ౧౭౨౨ రౌద్రినామ సంవత్సరం మార్గశిరశు ౬ లు (*i. e.* 22d November, 1800) గ్రామం చేరి, యావద్రాజ్యం బందోబస్తు చేసి, యీ సిద్దప్ప నాయునివారికి నడిచె గ్రామమున్ను రుసుమున్ను జప్తిచేసిరి. నెలకు పిమ్మట, కర్నల్ సాహేబులవారి వల్ల, మద్దగిరి సీమ తిరుమ

లయ్య అముల్దారుగానున్న శివరామయ్య శిరస్తాగానున్న నియమింపబడి వచ్చి, యీతాలూకా లెక్క పత్రాలు విచారిస్తూ వుండిరి; కర్నల్ సాహేబులవారున్న తాలూకాల జమాబంది వగైరా నిమిత్తం ధర్మవరం చేరి, యీ తాలూకా అములుదార్ల శిరస్తేదార్ల గ్రామస్థులను పిలిపించి జమాబంది చుకాయిస్తూ వుండగా, సిద్ధరామపురములో వున్న హండే సిద్దప్పనాయునివారు ధర్మవరానకు వచ్చి, కర్నల్ సాహేబుల వారి భేటీ తీసుకొని, తన పూర్వోత్తరం యావత్తు మనవి చేసుకొనెను.

7. ఆ మనివి కర్నల్ సాహేబులవారు చిత్తగించి, మా సవారి వెంబడి హండే అనంతపురానకు హాజరుగా రమ్మని అప్పణ యిచ్చినందున, అదే మేరకు వారి వెంబడి అనంతపురం చేరి, మండ్రోల్ సాహేబులవారి దర్శనము చేసుకోగా, మీ కైఫియ్యత్తు వ్రాసి పట్టీ తీసుకరమ్మని సెలవు యిచ్చినందున, అదే ప్రకారం పాత కాపుల నలుగురిని కూర్చుండపెట్టి, వకీలు కొత్తచెరువు శీనప్ప, బాళప్ప, వామణ్నగారి నరసప్ప, దేశాయి తిమ్మణ్ణ, వెంగన్న, వగైరావారు కూర్చుని పరంపర యావత్తు పూర్వోత్తరం వ్రాయించి యిచ్చినందున, రాజశ్రీ మండ్రోలు సాహేబులవారు ఆదరించి, నెల ౧కి కంఠేరాయి ౪౪ ౭౫లు అన్నానకు సంబళం నిష్కర్ష చేసి, పూర్వం మొగలాయివారి తాలూకు అమీర్ సాహేబులవారు యిచ్చిన, జహగీరు బుక్కపట్నం దగ్గర వుండే సిద్ధరామపురమున్ను దీనికి చెల్లే వుపగ్రామములున్ను, యివి గాక ప్రతి గ్రామాన వున్న రుసుమున్ను జప్తిచేసి, పూర్వం వ్రాసిన ప్రకారం నెల నెలకు సంబళం



యిచ్చి రసీదు తీసుకొనేలాగున, ఖజానాకు సన్నదున్ను ఆమీల్ దారునికి పరవానా యిచ్చిరి. కాన అదే ప్రకారం సంబళం అనుభవించుకుంటూ, దగ్గరవున్న యావత్తు జనాలను సంరక్షణచేస్తూ వుండగా, యీ యన భార్య నీలమ్మగారికి చెంగళమ్మ అనే కుమార్తె కలిగి సంవత్సరం శిశువుఅయి వుండగా, శా-శకం ౧౭౨౩ దుర్మతినామ సం. ఆషాఢ బ ౧౦ లు (A. D. 30th July 1801.) యీ సిద్దప్పనాయుడు సిద్ధరామపురములోనే కాలంచేసెను.

8. అప్పటికి యీసిద్దప్పనాయునివారి అన్నకొమారుడైన వసంతరాయనివారు యిరువై సంవత్సరముల వయస్సుగలవారై యుండిరి. కర్నల్ మండ్రోల్ సాహేబులవారు కడప మకాం మీద వుండగా, అచ్చటికిపోయి వారి దర్శనం చేసుకొని, యీ వర్తమానం అర్జి చేసుకున్నందున చిత్తగించి, ఆ సిద్దప్ప నాయుడు తన అన్న కొమారుడు వున్నట్టు చెప్పగా యెన్నడు వినలేదని సంశయించగా, అక్కడ ధర్మవరం దేశాయి నారణప్ప హజూరు మునిషిపనిలో వుండేగనక ఆయన ౧, అనంతపురం సుంకం మణియం సంజీవప్ప కుమారుడు పుల్లప్ప ౧, పరికి సుబ్బన్నకొమారుడు శేషయ్య ౧, వీరు తాలూకు మజుకూరు సుంకం యిజారా చేసే నిమిత్తం పోయి హజూరిలో వున్నప్పుడు, దివానులైన చంది వెంకట్రాయనివారు, రామచంద్రరాయనివారు, మునిషీలవగైరా వారు యావత్తు కచ్చేరిలో యీపుల్లప్ప శేషప్పగారు అనంతపురం స్థలం వారని అడిగినందున పూర్వం వ్రాసిన పారంపర్యసంతతి వాఙ్మూలము యావత్తున్ను దాఖిలా చెప్పి, "పట్టపుదొర సిద్ధరామప్పనాయునివారి కొమారు

డైన పెద్ద రామప్పనాయునివారి కొమారుడు యీ వసంతరాయడు పట్టపుదొరసరేను; యిందుకుయేమైనా హెచ్చుతక్కువ వచ్చినట్టు అయితే, సర్కారువారు చేసిన శిక్షకు హాజరుగా వుండగలవారము” అని కంపినివారికి ముచ్చలికా వ్రాసియిచ్చిరి.

9. యిదిగాక పరా యీ తాలూకా ధర్మవరం దేశాయి నారణప్ప సహితంగా యిదే ప్రకారం ముచ్చలికా వ్రాసి యిచ్చినందున, సిద్దప్పనాయునివారికి చేసిన సంబళం యీ వసంతరాయని పేరట నిష్కర్ష చేసి, ఖజానాకు సన్నదున్ను ఆమిల్ మాధవ రాయని వారికి దయ చేసిరి గనక, కర్నల్ సాహేబుల వారి అప్పణ తీసుకొని, సిద్ద రామపురానకువచ్చిన మరికొన్ని దినములకు కర్నల్ సాహేబుల వారు అనంతపురానకువచ్చినది విని, యీవసంతరాయనివారు తిరుగా పోయి, తన పెండ్లి నిమిత్తం ఖర్చు వెచ్చాలకు పేషగీ అడగవలెనని తలంచి, స్వతహా హజూరికి పోయి, అర్జీచేసుకోగా, ఆ యర్జి ఖాతరుకు తెచ్చి నాలుగు నెలల సంబళం పేషగీ యిమ్మని ఖజానాకు పరవానా వ్రాయించి యిచ్చిరి.

10. తదనంతరం యీ వసంతరాయడు ఆ ఆయివజు తీసుకపోయి, పెండ్లి సాహాయ్యములు యావత్తున్ను చేసి, నిజాపురం తాలూకు బాగవాడా అనేపరగణేలో సంకనహాళు అనే గ్రామంలో, వీరి పరంపర బాలదమానుమప్పనాయకుని తట్టునుంచి సంబంధం లెస్సగా విచారించి నబీగౌడు అనే ఆయన కొమార్తె ౯ సంవత్సరముల వయిస్సుగల కళ్యాణమ్మగారు ౧, నింబకల్లు గ్రామంలో వున్న కరిహుళి కొట్టూరప్ప కొమార్తె ౯-యేండ్లుగల వీరమ్మగారు౧, యీ యిద్దరిని యేక కాలమందు వివాహమయిన మరిమూడు నెలలలోగా, శాలివాహన శకవరుషంబులు ౧౭౨౪ అగునేటి దుందుభినామ సంవత్సర జ్యేష్ట మాసములో, యీ వసంతరాయనివారు చనిపోయిరి.

తదనంతరం, సిద్దరామ పురములో వున్న అమ్మగారి జన వివరం.

11. సిద్దరామప్పనాయుని రెండో భార్య పొన్నమ్మగారి కొమారుడైన చినరామప్పనాయుని భార్య చెన్నమ్మగారు యిప్పుడు కొరుకోడులో వున్నది యీ వసంతరాయునికి బాల్యమందే మాతా పితృలు వియోగము అయినందుననున్ను, తనకు పుత్త్రిలు లేనందుననున్ను, యీ చిన్నవాణ్ని వడి గట్టుకొని సాకి, కష్టనిష్టూరాలకు లోనై, బహుశా లాలన చేత శ్రీరంగపట్నం చెరలో సహా సంరక్షణచేసి, అతి వ్యామోహం చేత సాకుతూవుండగా, యీయనకు కాల ప్రమాణం తీరి, గతించిపోయినందున, బహు దుఃఖాక్రాంతురాలై, రెండు నెలల పర్యంతరం యింట్లోనే వుండగా, యీ వున్న కొదువ అమ్మగార్లు, సక్రమ్మ ౧, నీలమ్మగారు ౧, బసవప్పనాయుని భార్య పెద చెన్నమ్మగారు ౧, చినచెన్నమ్మగారు ౧, యింకా పెద్దమనుష్యులైనవారు వకీలు శీనప్ప ౧, బాళప్ప ౧, రాఘువప్పగారి అప్పణ్ణ ౧, వామణ్ణగారి శరసప్ప ౧, వీరి గురువులైన ముత్తైనపండె బసవలింగస్వాములవారు ౧, అలమూరి కరిబసవప్ప ౧, నబీరి పెద్దవీరప్ప ౧, వీరు మొదలయిన యావజ్జనము యీ పుత్ర శోకముచేత వ్యధపడుతూ వున్న చెన్నమ్మగారిని చూచి “దైవాధీనంచేత కావలసిన పనులు ఆయినదానికి యెన్ని దినములు వ్యధపడినా తీరదు; చనిపోయినవారు పోనేపోయిరి; యికను ముందువున్నవారి క్షేమం విచారించవలసివున్నది.”

12. “ఇదిగాక ముప్పయి నలుబయి అమడనుంచి చిన్న పాపలను తీసుకవచ్చి వివాహంచేస్తిరే, వారి గతియేమి? యీ

రెండు నెలలనుంచి దుఃఖాతురంచేత మీరు మూలపడి వుంటే, యీ సంస్థానం నడిపించి యావత్తు విచారించేవారు యెవరు? మీరు ధైర్యం తెచ్చుకొని, ముందు కాగలపనులు కానా వున్నవి; గనక, యీవర్తమానం యావత్తు కర్నల్ సాహేబులవారికి మనవిచేసుకొని, వారి సెలవు ప్రకారం నడవవలె"నని, బహువిధాలా బోధించి, పూరడించి తెలియచెప్పగా, పెద్దమనుష్యులద్వారా ఆ నీలమ్మ సక్రమ్మగారు సహా, యీ చెన్నమ్మగారితో మంచిపని అయినా, చెడ్డపని అయినా, నీ సమాధాన ప్రకారం నడవగలవారము అని చెప్పుకొన్నందున, ఆ చెన్నమ్మగారు ఆ వుత్తరములను కొంచెము అంగీకరించి, యిందాక వ్రాసిన వకీలు శీనప్ప బాళప్ప నబీరివీరప్ప మొదలయిన వారిని ప్రయాణంచేసి అంతగా, వారు అనంతపురానకు వచ్చి, మండ్రోల్ సాహేబులవారితో యావత్పూర్వోత్తరం మనివి చేసిరి. వారు యీ మనవి చిత్తావకు తెచ్చి, "యీ అమ్మగార్లలో యీ సంస్థానం నడిపించతగిన బుద్ధిమంతులు యెవ"రని అడుగగా, పదిమంది సమ్మతించి "పెద్దతనానకు యీ చెన్నమ్మగారిని నిష్కర్ష చేసినారం" అని మనవి అర్జి దాఖలుచేయగా, కర్నల్ సాహేబులవారు చిత్తగించి, యీ వసంతరాయని దివసాల ఖర్చులకు ఫేషగీ సహా హుకుం చేసి ఖజానాకు సన్నదు యిచ్చిరి.

13. పిమ్మట, ఆవకీళ్లు ముందు వంశానకు యెవరులేరు; పూర్వమందు యీ రాజ్యానకు విజాపురం శీమ నుంచి వచ్చేటప్పుడు, వీరి వంశస్థులు కొంతజనం అక్కడనే నిల్చిరి గనుక, వారిలో వొక చిన్నవాణ్ని పిలిపించి, పట్టాభిషేకం చేయగలందులకు తమ అప్పణ కావలెనని తిరుగా అప్పుడే అర్జీదాఖల్ చేసుకొన్నదిన్ని ఆ మండ్రోల్ సాహేబులవారు చిత్తగించి, అదే ప్రకారం సెలవు యిచ్చిరి గనక, ఆ వకీళ్లు సిద్ధరామపురం



పోయి, ఆ చెన్నమ్మ మొదలయిన అమ్మగార్లతో నున్ను, వసంతరాయని మామగారు అయిన నబీగౌడు మొదలయిన పెద్దమనుష్యులతోనున్ను, యీవర్తమానం చెప్పిరి. వారు విని, ఆ వకీళ్లతో, "నిజాపురం తాలూకా బాగవాడి అనేపరగణాలో ముత్తిగె ౧, వడవడగి ౧, యీ రెండు గ్రామాలలో, మూలపురుషుడు అయిన లక్కినాయకునికి, బాలద హనుమప్పనాయకుడు ౧, బళిగానాయకుడు ౧, అని యిద్దరు కొమాళ్లు. వారిలో, ఆ బాలద హనుమప్పనాయకుని సంతతివారు యీ అనంతపురం బళ్లారి ప్రాంత్యానకువచ్చిరి. బళిగానాయకుని సంతతివారు అక్కడనే నిల్చిరి. యిందుకు హద్దులు హాండేవారి గుమ్మట సమాధి మొదలయినవాటి పైన గుర్తులు వున్నవి. మేము చూచినది నిజమని" చెప్పి, వారితో కూడా ఆలమూరు కరిబసవప్ప ౧, బుక్కపట్నం మఠం శివలింగదేవర జనం ౧, నగరితాలూకా చినరామన్న ౧, సిద్ధమల్లప్ప ౧, కొట్రిగెబసవప్ప ౧, పెదకోటప్ప ౧, వీరు మొదలయినవారిని, చిన్నవాణ్ని పిలుచుకవచ్చే నిమిత్తమై పంపించిరి. వీరందరున్ను సదరు గ్రామాలకు పోయి, నబీగౌడు పెద్ద మనుష్యులు చెప్పిన సాదృశ్యములున్ను చూచి, ఆ బళిగానాయుడి సంతతిలో సిద్ధరామప్ప అనే పేరుగల వొక చిన్నవాణ్ని నిష్కర్ష చేసి తీసుకవచ్చిరి.

14. తదనంతరం, యీ చిన్నవాణ్ణి పట్టపుదొర అయిన వసంతరాయని భార్య కళ్యాణమ్మగారి వడిలో, వేసినందున, ఆమె దత్తపుత్రునిగా చేసుకొని, సంరక్షణచేస్తూ వుండగా, కొందరు దుర్జనులు నీలమ్మతో "చిన్నవాణ్ని తెచ్చి చెన్నమ్మగారు సాకుతూవున్నారు; ముందు నీ ప్రపంచం యేమి నడిపించే యోచన కనపడలేదు; నీవు ఆ చెన్నమ్మ చెప్పినట్లు విని వుండడానకు అతంత్రురాలవు గావు; గనక, ప్రత్యేకంగా భా

గం పంచుకొని, వేరై స్వతంత్రముగా వుండేది వుత్తమం" అని బోధించిరి. అందుకు ఆమె మనస్కరించి అనంతపురానకు వకీలు వచ్చి సంబళం తీసుకొని పోతూ వుండగా, నీలమ్మగారి తమ్ముడున్ను యింకా వారి పక్షపాత జనమున్ను వచ్చి అటకాయించగా, సంబళం అట్టే కచ్చేరిలోనే పడివుండెను. తదనంతరం, చెన్నమ్మగారి తట్టు వకీళ్లున్ను, నీలమ్మగారితట్టు వకీళ్లున్ను హాజూరికి పోయి, రెండు మూడు నెలలు పంచాయతి అయి హాజూరులో నిష్కర్ష అయినది, చెన్నమ్మగారి తట్టు హిస్సాలు ౨, నీలమ్మ సక్రమ్మగారి రునుములు ౧కి హిస్సా ౧, వుభయం 3 మూడు హిస్సాలమీద సంబళం నిష్కర్ష అయి, తాలూకు మజుకూరు తహశ్శీలుదారు నరశింగరాయని వారిపేట పరవానా సాదరు అయినందున, తీర్పు ఆయెను. యిందుకు సాక్ష్యం కర్నల్ సాహేబులవారి పరవానా యీ ప్రకారం ఆయెను.

15. తదనంతరం, యీ చెన్నమ్మగారి నగరిలో దొంగలు చొరపడి, సొత్తులన్ని పోయినందువల్లనున్ను, తమకున్ను నీలమ్మ గారికిన్ని కలహంగా వున్నందున, యీ చిన్నవానికి యేమి వుపద్రవం వచ్చునో అనిమనస్సుకు అందేశా పుట్టి, హాజరత్ కర్నల్ సాహేబులవారు పులివెందల ఆ ప్రాంత్యాలయందు వుండగా, అక్కడికి వకీళ్లను పంపించి, యీ సిద్ధరామపురంలో వుండే దానికి రాజీ లేదు; తాలూకు మజుకూరులో చేరిన మౌజే కొరకోడు అనే గ్రామంలో వుండడానకు అప్పణ అయితే, అక్కడ యిల్లు చేసుకొని వుంటున్నాము అని, అర్జీ యిమ్మనగా అదే ప్రకారం వారు అర్జీ యిచ్చినందున, ఖామందులవారు చిత్తగించి, కొరకోడులో వీరు కోరిన జాగా యిప్పించమని, ఆమీలు నరసింగరాయనివారికి అధికారపత్రిక పంపిరి. అదేప్రకారం నరశింగరాయనివారు



కొరకోడు రెడ్డి కరణాలను పిలిపించి, రెండు యిండ్లు యిప్పించుమని తాకీదు చేయగా, వారు అదే ప్రకారం రెండు యిండ్లకు స్థళం యిప్పించినందున, యిన్నూరు వరహాలు ఖర్చు చేసి, నగరు కట్టించి, చేదు బావి తొవ్వించి, ఆ శిద్ధరామపురం విడిచి, కొరకోడు వచ్చి చేరిరి.

16. తదనంతరం, ఆ చిన్నవాడైన సిద్ధరామప్పనాయుడు మంజూరు కావలెనని, మండ్రోలు సాహేబులవారు ఆదవాని మకాం మీద వుండగా, అక్కడికి యీ చెన్నమ్మగారున్ను సిద్ధరామప్పనాయుడున్ను వకీళ్లు మొదలయినవారున్ను పోయినంతట, వారు ఆ చోటు విడిచి, గుత్తి తాలూకు వ్రేష్ఠపాడు దగ్గెర దిగి వుండగా, అక్కడికి పోయి దర్శనం అయి, "లోగడ అనంతపురంలో అర్జీ చేసి తమ అప్పణ అయిన ప్రకారం చిన్నవాణ్ని తీసుకవచ్చినాము అని," మనవిచేసిరి; యీవర్తమానం యావత్తు విని, దొరవారు "ఆ చిన్నవాణ్ని సంరక్షణచేయండి" అని చాలా దయచేత వుత్తరవు యిచ్చిరి. గనక, వారివద్ద అప్పణ తీసుకొని, సంతోషంతో తిరుగా కొరకోడు వచ్చి చేరిరి. తదనంతరం, కర్నల్ సాహేబులవారు విలాయితికి పోయిన పిమ్మట, కొడికొండ జిల్లా చేసిన త్రైవార సాహేబులవారు వచ్చిరి. వీరు పోయిన తర్వాత, గేహాగన్ సాహేబులవారు వచ్చి, కల్కటరు హోదా విచారిస్తూ వుండగా ఆ వకీళ్లు యీ చెన్నమ్మగారు సాక్షాన్న శిద్ధరామప్పనాయుని వారిని అనంతపురానకు పిలుచుక వచ్చి హాజరతు వారి భేటి చేయించి, లోగడ కర్నల్ సాహేబులవారి అప్పణ అయిన వివరమున్ను, వారు సెలవు యిచ్చిన అభిప్రాయమున్ను, గుత్తి మకాం మీద వారి భేటి అయినదిన్ని, యీ యావద్వర్తమానం వినికి చేయగా, వారున్ను అదేప్రకారం సెలవు యిచ్చిరి.

17. పిమ్మట, తాము తిరుగావచ్చేటప్పుడు బసవేశ్వరుని దేవాలయానకు వచ్చి దర్శనం చేసుకొని, పేట వెంబడి ఛత్రి, చౌరి, వాళది, వుడాన్ పావడ, అనే బిరుదులతోనున్ను, భట్లకైవారముతో కూడా దిగిన స్థలానకు వచ్చి చేరిరి. యీప్రకారం ఆ అనంతపురంలో అయిదారు దివసములు వుండి, ధణీల సెలవుతీసుకొని, కొరకోడు వచ్చిచేరిరి. యీప్రకారం కొన్ని దినములు జరిగిన పిమ్మట, గుత్తి తాలూకా గల్లు అనే గ్రామంలో పూర్వం నుంచి పరంపరగా బంధుత్వం గల జగ్గుల సక్రప్ప కుమార్తె అయిన అయిదు యేండ్ల వయస్సుగల లింగమ్మ అనే చిన్నదాన్ని తీసుక వచ్చి, సాక్షి తాంబూలం పంచి, యీ శిద్ధరామప్పగారి భార్య అని నిష్కర్ష చేసి, కులాచార పద్ధతిగా, తమ సంస్థానం మర్యాద ప్రకారం ఆచిన్నదాన్ని పిలుచుకవచ్చి నగరిలోవుంచుకొని, సంరక్షణ చేస్తూవున్నారు.

18. శాలివాహనశకం ౧౭౩౩ అగునేటి ప్రజోత్పత్తినామ సం. వైశాఖశుద్ధ ౧౫ల సరికి జీవితుడై వున్నాడు. యీ వాండే వారి మర్యాదలు; వీరు శివభక్తులు. లింగవంతులు. వీరికి కులదైవమున్ను యిష్టదైవమున్ను అయిన విజాపురం శీమలో వున్న సొన్నలాపురం శిద్ధరామేశ్వరుణ్ని గాని, యితర దేవతలను కొలవరు. శివపూజ చేయక గాని, గంగ పానం చేయరు. మధురాహారములే గాని, మధు మాంసభక్షణ చేయరు. యీడేరిన చిన్నదాన్ని వివాహము చేసుకోరు. కాలప్రమాణం తీరి నష్టము అయితే, వీరశైవాచార పద్ధతిగా సమాధి చేస్తున్నారు.

సమాప్తము.

---

బుక్కరాయ సముద్రం అనంతసాగరం యీరెండు గ్రామాలయొక్క చెరువు యొక్క కైఫియతు.

పూర్వం దక్షిణప్రాంత్యమందు గార్గేయమహాముని ఆశ్రమమందు దేవరకొండకు పడమర అరఘడియ దూరంలో ఓకూరు అనేగ్రామం వుండెను. ఆగ్రామమందు నందవరీక బ్రాహ్మడు డాకరాజు అనేవాడు వానిభార్య మేళమ్మ వీరు యిద్దరు దంపతి సమేతంగా ఆవూరిలో వాసంచేసుకొనివుండిరి గనుక యీ డాకరాజుకు చౌడేశ్వరి కృపవల్లను వక మొగశిశువు కలిగెను. ఇట్లావుండగా కొన్నిదినాలు అయిన పిమ్మట ఆడాకరాజు ఆవూరిలో కాలం ఆయెను. ఈ మేళమ్మ ఆవూరిలోవుండి నిర్వాహకం చేయజాలక తమచిన్నవాడుపేరు చిక్కప్ప అనేవానికి అయిదుసంవత్సరాలు అయివుండగా ఆచిన్నవానిని వెంబడి తీసుకొని దేశ సంచారానికిపోయెను. ఇట్లా కొన్నాళ్లు జరిగిన పిమ్మట పంపాతీరమందు విద్యానగరపట్టణంలో బుక్కరాయలు రాజ్యంచేస్తూవుండగా ఆపట్టణానకు పోవలెనని యోచనచేసి ఆపట్టణం సమీపమందు చక్రతీర్థందగ్గిర కోదండరామస్వామి దేవాలయందగ్గిర యీ చిన్నవానిని వుంచి తాను భిక్షాటనానకు నగరంలోకి పోయెను. ఇక్కడ యీ

చిన్నవాడు రామస్వామి దేవళంవద్ద పండుకొని వుండగా ఆసమీపమందు పాముపుట్టవుండెను గనుక, పుట్టలో నుంచి ఘటసర్పం బయటికివచ్చి యీ చిన్నవాని ముఖానకు యెండ తాకకుండ తనపట్టం విచ్చి ఆడుతూవుండగా ఆసమయమందు నాగాభోగి అనే పాములవాడు యీసర్పం చిన్నవానిమీద ఆడుతూవున్నదిచూచి తాను ఆశ్చర్యపడి యిట్లా కొంతసేపు చూస్తూవుండగా ఆపాము కొంతసేపు ఆడి ఆవల తనపుట్టలోకి పోయెను. ఆనాగాభోగి చెప్పినమాట వీడు దశావంతుడు అయ్యేయోగం వుంటే నేను నాగస్వరం పట్టితే పునహః సర్పంవచ్చి ఆడినట్టయితే వీడు మహాదశావంతుడు అని తెలును కుందామని నాగస్వరం పట్టేసరికి ఆనాగస్వరం ధ్వని విని రెండుఘడియలు ఆడి పునహః పుట్టలోకి పోయెను. ఆచిన్నవానిని ఆలింగనముచేసుకొని నీవు మహాదశాపురుషుడవైతే నాకు యేమియిచ్చేవని అడుగగా నాకు మహాదశవచ్చినట్టయితే నీపేర వక తటాకం కట్టించి గ్రామాలు చెరువులు కట్టిస్తున్నానని చెప్పెను. ఆనాగాభోగి మార్గస్థుడై పోయెను. ఇంతలో యీమేళమ్మ యాచకం చేసుకొని దేవళం దగ్గిరకు వచ్చెను. ఈలాగు కొన్నిదినములు చనిన పిమ్మట బుక్కరాయలప్రధాని నారాయణప్ప వుండ



గా వాని ఆశ్రయంలోవచ్చిచేరెను. ఇట్లా కొన్నాళ్లు కాలక్షేపంచేసుకొని వారియింట్లో పనిపాటు చేసుకొనివుండెను. ఆచిక్కప్ప అనే చిన్నవానికి వుపనయనముచేయించి విద్యాభ్యాసంచేయించి తనవెంబడిగా రాజు దివాణానకు వస్తూ పోతూవుండెను. ఇట్లా కొన్నాళ్లు జరిగినమీదట చిన్నవాడు బుద్ధిమంతుడై యీప్రధాని మనస్సుప్రకారం నడుచుకొంటూవుండెను. ఈప్రకారంగా వుండగా బుక్కరాయలవారిపేర డిల్లీ పాదశహా వారిదగ్గెరనుంచి పరవనావచ్చెను. అది చదువడానకు రాయసంవారిని పిలువమని రాయలవారిశెలవు అయినందున మనుష్యులు రాయసంవాండ్లను పిలిచేనానికి వచ్చి చూస్తూ అపరాత్రి అయివుండెను గనుక రాయసంవారు యింటికి పోయివుండగా ఆమనుష్యులు రాయలవారికి 'కచ్చేరీలో వఖరూలేరు'. అని చెప్పిరి. అయినా చింతలేదు. గ్రామంలో విచారించి యెవడైనా జాబు చదివేవాణ్ణి తోడుకురమ్మని శెలవు యిచ్చినందున గ్రామంలో విచారించగా బోధవేళ గనుక యెవరూ కనపడలేదు. ఈప్రధాని యింటి ముందర చావడిలో యీ చిక్కప్ప అనేవాడు పడుకొని నిద్రపోతూవుండగా వాణ్ణిచూచి లేపి రాయలవారు నిన్ను పిలుచుకరమ్మని శెలవు అయింది.

రమ్మనిపిలిస్తే నేను చిన్నవాణ్ణి నాతో పనియేమి? అనగా నీకు దశకాలం వచ్చెను. జాబు చదువనేర్తువా అని అడుగగా "నాకుతోచినంత యెరుగుదును." అని చెప్పుకోగా వీణ్ణి తోడుకుపోయి రాయలవారి సన్నిధానాన విడిచిరి. విడిచినప్పుడు రాయలవారు పరవానా చేతికియిచ్చి చదువురా అనగా విశదంగా చదివి చెప్పేవేళకు విని చాలాసంతోషపడి పండుక్కో పొమ్మని శెలవుయిచ్చిరి. తర్వాత తెల్లవారెను. మరసునాడు పాదుశహదగ్గరనుంచివచ్చిన హరకారులు బదులు లిఖితాలు వ్రాయించి యిస్తే పోయ్యేమని శెలవు అడుగగా బదులువుత్తరం రాయడానకు గాను రాయసంవాండ్లను పిలిచి వ్రాయమంటే మేము పరవానా చూచినవారముకాము.వుత్తరం దయచేస్తే బదులు వ్రాసేమని చెప్పగా అవుత్తరం విచారిస్తే కుత్తుదీసి దూలంలో చిక్కివుండినందున కనుపించలేదు. గనుక రాత్రి పరవానా చదివినవారు యెవరు అని విచారించి ఆచిన్నవాణ్ణి పిలుపించి రాత్రి నీవు చూచిన ఫరవానామాటలు నీకు యెరుకవున్నదా! బదులు వుత్తరం వ్రాయవలసివున్నది అని అడుగగా రాత్రి తానుచూచిన మతలబు అవగాహనచేసి నకలు వ్రాసి హరకారులకు బదులు వుత్తరం వ్రాసి యిచ్చి యీనకలు రాయల



వారి చేతికియిచ్చి సెలవుతీసుకొని వెలపటికి వచ్చెను. ఆదినం రాత్రి రాయలవారు పడకయింటికిపోయి శయనించి వుండగా యీజాబు దూలంలోవుండగా చూచి కాగితం చూచుకోగా రాత్రి పరవానా అని మనస్సుకు తెలుసుకొని మరసనాడు రాయసంవారిని పిలుపించి యీనకలు సహా ఇచ్చిచూచేవరకు తప్పకుండా వుండె గనుక మనస్సుకు తెలిసి వీడు యేకసంత పురుషుడు ; బుద్ధిమంతుడు అని చిత్తమందు వుంచి కచ్చేరికివచ్చి ప్రధానసమేతం సకలజనసహితంగా కూచోని యీచిక్కప్పను పిలుపించి శిఖావస్త్రతాంబూలం యిచ్చి, ప్రధాని, పట్టంయిచ్చెను. కితాబుచిక్కవడయరు అని కితాబుయిచ్చి అంపించిరి. వుత్తరానకు కార్యభారం నిమిత్తం రాయలవారు సకలసేనాసమేతుడై ప్రయాణమైపోతూ యీచిక్కవడయరును పిలుపించి సకలవ్యవహారం బీగంముద్ర బొక్కసంసహా వొప్పించి తామురాచకార్యానకు తర్లిపోయిరి. పోయినతర్వాత కొన్నిదినాలు రాజ్యం రూకలు బొక్కసంసహా విచారిస్తూవుండగా కొన్ని దినాలమీద రాయలవారి పెళ్లాము యీతనమీద మనస్సుపెట్టి అగత్యం రావలెనని చెప్పి అంపించగా యిది మహాద్రోహం పనివచ్చెను అని యోచన చేసెను..........

దేహమందు స్వస్తంలేదు అని వర్తమానం రాయలు విని ఆక్షణమందు విద్యానగరానకు వచ్చి చిక్కవడయర్రును పిలుపించి వుపచరించి నీకు వివాహం చేయవలెనని వుంటెని యిట్లాపని యేలచేస్తివి అని అడిగినందున నాకు యీలాగు వుండవలెనని బ్రహ్మదేవుడు వ్రాశివున్నప్పుడు నాప్రియత్నం యేమివున్నదని మనివిచేసుకోగా చిత్తానకుదెచ్చి అయిన నాకుచింతలేదు. మనస్సునయేమి కావలెనని వున్నావు. అడుగుమని శెలవుయియ్యగా పూర్వం సంపాదించినబొక్కసం యీవల నేను సంపాదించిన పదార్థం సహా దయచేయిస్తే నాకు సంతృప్తి అని అడుగగా అదేప్రికారందయచేసి తాము పూర్వం సంపాదించిన పదార్థము సహా ధారాగ్రిహితంగా యిచ్చిరి. యిచ్చిన తర్వాతబహుసంతోషపడి వాపీకూపతటాకాదులు నిర్మాణాల నిమిత్తం పూర్వరాజ్యానకు వస్తూ మార్గాన పెనుగొండ దిక్కునుంచి దక్షిణాననుంచి వుత్తరానకు వొచ్చే వంక వస్తూవుండె గనుక అక్కడ రెండు నల్లగుట్టలు వుండగా యిక్కడ తటాకం నిర్మాణంచేస్తేబాగావుండేని అని మనసాచింతించి అక్కడనిలిచి తటాకం ఆరంభంచేసి తాను పూర్వమందు నాగాభోగికి యిచ్చిన మాటప్రికారం నాగభోగిపేరిట తటా



కం గ్రామం నిర్మాణంచేసి దానికి నామధేయం నాగసముద్రం అని పేరుపెట్టెను. ముందర పూర్వరాజ్యమందు యింకా మంచి స్తళాలు యెక్కడవున్నా తటాకాలు నిర్మాణం చేయవలెనని అగస్త్యాశ్రమం పినాకినికొండలు భేదించి వొచ్చినగండి చూచి యిక్కడ తటాకం నిష్కరుష జేయవలెనని అనేకమంది సమూహాంకూర్చి ఆరంభం చేయించి కొండలమీదనుంచి గుండుగండికి అడ్డపడే లాగునను శాశ్వితతటాకం ఆరంభంచేశిన రాత్రి చిక్కవడయరుకు స్వప్నమందు పినాకిని స్త్రీరూపంగావచ్చి నీవు యిక్కడచెరువు నిర్మాణంచాయవద్దు. నేను నిలిచేదిలేదు. అని చెప్పగా ముందర నాకు యేమి బుద్ధి అని మనవిచేసుకోగా యిక్కడికి దక్షిణభాగమందు నాచెల్లెలు చిత్రావతి అనే నది వున్నది. అక్కడ కట్టిస్తే నిలుస్తూవున్నది పొమ్మని శెలవుయియ్యగా అక్కడనుంచి ముందర పార్లపల్లె గండి విచారించగా అక్కడి నది పట్టుపడేది లేదు, అని చెప్పగా అక్కడనుంచి వెనక్కుతిరిగి పశ్చిమానకు వచ్చి గార్గేయ ఆశ్రమమందు దేవరకొండ వోరూరు వుండినది చూచి యిందుకు పదికోసులమీద కంబురిగి శ్రీస్వామికొండలలో పుట్టిన పాండునది అనే నదివస్తూవుండగా చూచి యిక్కడ తటాకం

నిర్మాణం చేయించవలెనని తటాకం నిర్మాణంచేసి తటాకం రెండు మరవల రెండుగ్రామాలు తమ దొరపేరిట తూర్పుమరవన బుక్కరాయ సముద్రం రాయలుపేరిట గ్రామం, పడమట మరవన యీ యన పెండ్లాముపేర అనంతసాగరం అని పేరుపెట్టి నిర్మాణంచేసి తటాకం కట్టమీద నల్లగుట్టమీద బాణలింగం దెప్పించి దేవాలయం గట్టించి శివప్రతిష్ఠచేసి శంకరదేవుడు అనే నామధేయం నిష్కరుష చేయించి యీశంకరేశ్వర దేవళం ముందర రాతిబండకు శిలాశాసనం వేయించి అందులో శాలివాహన శకవర్షంబులు ౧౨౮౬ అగునేటి క్రోధి సం. కార్తిక బ ౫ గురువారం వ్రాసినది యీ ప్రకారం వ్రాసినది బుక్కరాయసముద్రం గ్రామంలో కోటకుపడమర విష్ణుస్థానం లక్ష్మీనారాయణస్వామి అనేది ౧, లోని కోటకు దక్షిణం ఆంజనేయ దేవస్థానం ౧, శంకరేశ్వరుడు దేవళానకు పడమరకట్టమీద చౌడేశ్వరి దేవళంకట్టించి ప్రతిష్ఠచేసినారు యీగుడికి వుత్తర భాగాన విఘ్నేశ్వరుని దేవాలయం నిర్మాణంచేసి వున్నది అందు ౫ దేవస్థానాలు నిర్మాణంచేసి గ్రామానకు రెడ్డితనం బుక్కరాయసముద్రానకు బళిరెడ్డివెళ్లబోయని వెంగళరెడ్డి వుభయుం యిద్దరు అనంతపురానకు గుగ్గిళ్ల చిన్నపరెడ్డి ౧, వీరిని నిష్క



రుషచేసి యిక్కడనుంచి ముందర యింకా మంచిస్థళాలు బయిలు ప్రశస్తంగావుంటే చెరువు కట్టించవలెనని యీబుక్కరాయసముద్రానకు దక్షిణభాగం పదహారు కోసులమీద వరగిరి శ్రీవెంకటేశ్వరుని కొండదగ్గిర చిత్రావతి అనే నదివున్నది చూచి యింకా యీకొండకు పశ్చిమభాగాన రెండు పెద్దవి నల్లగుట్టలువుండగా యీగుట్టలు నడుమ నదిపోతూవున్నది చూచి యిది బయలు యిక్కడ తటాకం గొప్పగా నిర్మాణం చేయవలెనని పనియిచ్చి బహుమంది వడ్డెవారిని జనాన్ని పిలుపించి కట్ట ఆరంభం చేయించి తూర్పుమరవన బుక్కపట్నం పడమట మరవన అనంతసాగరం రెండుగ్రామాలు నిర్మాణంచేసి కట్టక్రింద చౌడేశ్వరి దేవాలయం వకటి యీదేవళంతో విఘ్నేశ్వరుని దేవాలయం ౧ కట్టించి యీ ప్రకారం కొన్నిదినాలువుండి యిక్కడనె అంతర్ధానమైపోయెను. అనంతసాగరం బుక్కసాగరం అనే గ్రామాలున్ను చెరువులున్ను సదరహి వ్రాశిన రెండుస్థళములయందు వున్నవిగాని మూడో స్థళమందు యీ ప్రకారం లేదు. ఈవల కొన్నిదినాలు నడిచిన పిమ్మట బుక్కరాయసముద్రం చెరువు వుత్కృష్టంగా నిండి రెండుమరవలు పట్టక వుదకం పారుతూవుండగా బుక్కరాయసముద్రం ఆయగాండ్లు పురజ

నాలు చూచేదానికి వచ్చి వుండగా ఆజనంలో వక స్త్రీకి శివంయెత్తి నేను గంగాభవాని నాకు ఆహారం నరబలియిస్తే నిలుస్తూవున్నాను. లేకపోతే నిలవవలసినది లేదు. అని చెప్పినందున అక్కడ వుండిన గ్రామస్తులు పెద్దమనుష్యులు నరబలికి యేలాగున చేతాము అని ఆలోచనచేయగా అందుమీద బుక్కరాయసముద్రం గ్రామంలో బసిరెడ్డికి కడకొట్టు యేడోకోడలు ముసలమ్మ అనే చిన్నది యింకా యీడేరకవుండగా ఆచిన్న పడుచుకు గంగాదేవిపూని నీవు బలికావలెనని చెప్పగా అదేప్రకారంగా అక్కడనుంచి బలికి సిద్ధమై పసుపుకుంకుమ పెట్టుకొని వులికిన చీరకట్టుకొని నిమ్మపండు చేతితో పట్టుకొని కట్టమీదికివచ్చి తమ మామ అయిన బసిరెడ్డికి నమస్కారంచేసి పురజనాలకు నమస్కారంచేసి నాకు గంగాభాగీరథి శెలవు అయినది. నేను బలిపోతూవున్నాను. అని రాయభారం తూముకు తూర్పుపదహైదు బారలమీద గుమ్మడపడి వుండగా ఆగుమ్మడలోనికి, కట్టలోనికి నెర్రివిడిచివుండగా అనెర్రి గుండా లోనికిపోయి నిలిచినందున పైన మన్ను రాయివేశిరి గనుక కట్టనిలిచెను. తదనంతరం మరసునాడు యీబలిపోయిన ముసలమ్మ గ్రామంలో స్త్రీజనంమీద ఆవేశంవచ్చి నన్ను శిలారూపంగా ప్రతిమచేసి వృక్షంకింద పెట్టి కొలవ



మని చెప్పెను. కొన్నిదినాలు ఆయమ్మ గుమ్మడ దగ్గిర వచ్చే పొయ్యే జనులు 'ముసలమ్మా' అని పిలిస్తే 'వో' అని పలుకుతూవుండినందున వఖనాడు రాత్రి గడ్డికిపొయ్యేవారు 'ముసలమ్మా' అని పిలువగా 'వో' అని పలికెను. 'చచ్చినా నీకావరం విడవకపోతివి' అని చెప్పినందున ఆదినంనుంచి పలికేది మట్టామెను. ఆముసలమ్మకు యీదినానకు నిత్యాపూజనడుస్తుంది. ఆరాయలవంశస్థుడు కృష్ణరాయలు కొన్నిదినాలు రాజ్యభారం సకలజనాన్ని సంరక్షణచేసి కాలపక్వమాయెను. అయినది శాలివాహన శకంబులు ౧౪౫౨ అగునేటి ప్రవర్తమాన క్రోధన నామసంవత్సరం జ్యేష్ఠ శుద్ధ ౬ భానువారం నిర్యాణం అయిరి. తదనంతరం కృష్ణరాయలవారి భార్యలు చిన్నాదేవి ౧, తిరుమలదేవి ౧, వీరు యిద్దరికిన్ని యిద్దరు ఆడబిడ్డలు కలిగియుండిరి. తిరుమలదేవి కొమార్తె రామరాయలకు వివాహమాయెను. చిన్నాదేవి రెండోకొమార్తెను రామరాజు తమ్ముడైన తిరుమలరాయులకు యిచ్చి వివాహంచేసిరి. తమకు పుత్రులు లేరని సంస్థానానికి అళియపట్టం అనగా అల్లునిపట్టంకట్టవలెనని దొరసానులు సంకల్పించగా బొక్కసం గొల్ల సనకయ తిమ్మయ అనేవాడు రాజు లేనందున రాజ్యం అరాజకమైనది, బొక్కసం

తన స్వాధీనంగా వున్నదని చతురంగబలాన్ని వొనగూర్చుకొని బందోబస్తీచేసి యీరామరాజు తిరుమలరాజులను పట్టివేయవలె నని యోచనసేయగా విని దేశంవిడిచి పారిపోయిరి. సనకయ్యా తిమ్మయ్యా రాజ్యం విచారిస్తూవుండెను. ఈరామరాజు తిరుమల్రాజు గ్రామం చెలాయించిపోయి పెనుకొండ మొదలయిన సంస్థానాలు సంచారం చేసుకొని కొంతసేన కూర్చుకొని ఆదవానిచేరిరి. అక్కడ నాలుగు నెలలు వాసంచేసుకొని కందనూలు గద్వాల ఆప్రాంత్యాల కొంత సైన్యాన్ని పిలుచుకొని సకల సేనా సమేతులై విద్యానగరానకు పోయి దండు యెత్తిరాగలవారు. అని యీవర్తమానం చారులవలన సనకు తిమ్మయ్యా విని తనకు యీరాజ్యం అరాచకమైనది దొరలు యెవ్వరు లేమ అని కుదుపషా, బరీద, పాదషాహనిజామాదులకు లిఖితం వ్రాయించి మీరు చతురంగబలసమేతులై వొస్తే రాజ్యం యావత్తు మీస్వాధీనం అవుతూవున్న దని వ్రాయించి అంపించగా ఆపాదశహావారు ముగ్గురు సకలసేనా సమేతులై వచ్చి విద్యానగరానకు పరువుమీద దిగిరి. యీవర్తమానం చారులనలన యీరామరాజు తిరుమలరాయనివారు తామున్న స్వర్ణలాపురమందు వుండే సూండే హనుమప్పనాయకు బహుశూరుడు



అని విని సైన్యయుక్తంగా పిలుపించి చాకిరీనిలిపిరి. ఈరీతిన ఫౌజుబందీచేసుకొనిపోయి విద్యానగరానకు రెండుపరువులమీద తుంగభద్రాతీరమందు దిగిరి. ఆపావశహాఫౌజు నూతనస్తులు గనుక స్థళం పవుజు సనక తిమ్మయ్యాను అగాడితో వుంచుకొని యుద్ధానకు సన్నద్ధులై యుండగా చారుల వలన ఈరామరాజు తిరుమలరాయనివారు తఘంజ హనుమప్పనాయుని సహా పట్టిపగలు రణభేరివేయించి అగాడిలోవున్న సనక తిమ్మయ్యా పవుజు మీద పడి యుద్ధంచేయగా అక్కడవుండిన స్థళపాతవాండ్లు వీడు గొల్లవాడు ధనబలంచేత సంస్థానం బలకాయించవలె నని ప్రయత్నంచేసినాడు వీనిని మనము సహాయముచేస్తే మనకు దైవసహాయం కానేరదు. అని యుద్ధానకు తొలగి చక్కగాపోయిరి. లడాయిలో సనకయ్యా తిమ్మయ్యా చిక్కెను. వానిని కొట్టి పారవేసిరి.యీవర్తమానం చారులవలన దొరసానులు విని ప్రధానుల పిలుపించి రామరాజు తిరుమలరాజును పిలుచుకవచ్చి పట్ణం వీరి స్వాధీనం చేయమని దొరసానులు శెలవు యిచ్చినందున ప్రధానులు సకలసేనాసమేతంగా దండుకుపోయి వారిని తోడుకొని పట్ణం వీరి స్వాధీనం చేసిరి.

---

# ABSTRACT TRANSLATION OF THE INTRODUCTION

TO

## THE WARS OF THE RAJAHS AS FOUND IN THE ORIGINAL LOCAL CHRONICLE

IN THE MACKENZIE COLLECTIONS.

### KAIFIYAT OF THE TANK OF THE TWO VILLAGES BUKKARAYASAMUDRAM AND ANANTAPURAM.

In the village of Voruru which was situated near the hermitage of the ascetic Gargeya there lived a Nandavarika Brahmin named Dakaraju and his wife Mêlamma. They had a son named Chikkappa. Dakaraju having died Mèlamma left the village with her son and went to the city of Vijayanagara to eke out his livelihood. One day, she left the boy near the temple of Kodandaramaswami, and went into the city to beg alms. The boy was sleeping on the bare-earth when a cobra came out of an ant-hill and spread its hood over his head to protect it from the Sun. A snake charmer named Nâgâbhôgi who observed it, embraced the boy when he woke up and asked him "What will you do for me when you become a great personage"? The boy answered, "I shall excavate great tanks and build villages and name them after you." Mèlamma, entered the service of Narayanappa the chief Minister of king Bukka



as a domestic servant, and the boy was brought up by the minister.

One day king Bukka received a *Firman* from the Emperor of Delhi at midnight. No scribes were in attendance. The servants of the king who were sent to seek out a scribe found Chikkappa sleeping in the office in front of the minister's house. He was taken to the king and read out and explained the *Firman*, clearly, so that the king was pleased. Next day when the scribes were asked to draft a reply to the Emperor's *Firman*, it was found that the *Firman* was missing. The scribes expressed their inability to prepare an answer without reading the *Firman*. The king sent for Chikkappa who reproduced the wording of the *Firman* from memory. That night, while retiring the king noticed the missing *Firman* in a beam (in his bed chamber) and showed it next morning to the scribes. They found to their great astonishment that Chikkappa had reproduced it with remarkable fidelity.

Pleased with his intelligence the king appointed Chikkappa, Minister and conferred on him the title *Wodayar*.

The king left the administration in the hands of Chikkappa and went on an expedition. During his absence the queen made

advances to Chikkappa who resisted them. On his return from the expedition the king guessed the situation......He admired the conduct of Chikkappa and asked him to crave a boon. Chikkappa begged all the coin in the Treasury wherewith to build villages and excavate tanks. Then he left Vijayanagara for the Eastern kingdom. On the way he built a tank between two hills and called it Nagasamudram after the snake charmer Nagabhogi. He contemplated daming the river *Penakini* between two hills. But the river appeared to him in a dream in the guise of a lady and warned him against the daring enterprise. She advised him to *dam* her younger sister the river *Chitrawati*. Then he threw a *dam* across the river *Pandu* near *Devarakonda* and made a tank. Near the two sluices of the tank he built two villages. One he named Bukkarayasamudram after his master, and the other Ananthasagaram after the queen. He built a temple on a hill and an inscription there dated Thursday the fifth of the dark fortnight of the month of *Kartika* in the cycle year Krodhi, corresponding to the saka year 1286, furnishes this information. There are diverse temples in the village of Bukkarayasamudram.

---

'VAVILLA' PRESS, MADRAS. 1920.

